| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడయితే | తేన, చ | = వానిచేతను |
| ఇమమ్ | = ఈ | అహమ్ | = నేను |
| ధర్మ్యమ్ | = ధర్మయుక్తమైన | జ్ఞానయజ్ఞేన[1] | = జ్ఞానయజ్ఞము ద్వారా |
| ఆవయోః | = మన ఇరువురియొక్క | ఇష్టః, స్యామ్ | = పూజితుడను అగుదును |
| సంవాదమ్ | = సంవాదరూపమైన గీతాశాస్త్రమును | ఇతి | = అని |
| అధ్యేష్యతే | = పఠించునో | మే, మతిః | = నా అభిప్రాయము |

ధర్మయుక్తమైన మనసంవాదరూపమైన ఈ గీతాశాస్త్రమును పఠించువాడు జ్ఞానయజ్ఞముద్వారా నన్ను పూజించువాడని నా అభిప్రాయము. (70)

**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్ ॥ 71 ॥**

శ్రద్ధావాన్, అనసూయః, చ, శృణుయాత్, అపి, యః, నరః,
సః, అపి, ముక్తః, శుభాన్, లోకాన్, ప్రాప్నుయాత్, పుణ్యకర్మణామ్ ॥ 71 ॥

| | | | |
|---|---|---|---|
| యః, నరః | = ఏ నరుడయితే | సః అపి | = అతడును |
| శ్రద్ధావాన్ | = శ్రద్ధగలవాడై | ముక్తః | = పాపవిముక్తుడై |
| అనసూయః, చ | = దోషదృష్టిలేని వాడై | పుణ్యకర్మణామ్ | = పుణ్యకర్మలను ఆచరించువారియొక్క |
| శృణుయాత్, అపి | = (ఈ గీతాశాస్త్రమును) వినునో | శుభాన్, లోకాన్ | = ఉత్తమలోకములను |
| | | ప్రాప్నుయాత్ | = తప్పక పొందును |

శ్రద్ధాదరములుగలవాడును, దోషదృష్టి(దోషములెన్ను స్వభావము) లేనివాడును ఐన మనుష్యుడు గీతాశాస్త్రమును వినుటవలనగూడ పాపవిముక్తుడై, పుణ్యకర్మలను ఆచరించువారుపొందు ఉత్తమలోకములను పొందును. (71)

**కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥ 72 ॥**

కచ్చిత్, ఏతత్, శ్రుతమ్, పార్థ, త్వయా, ఏకాగ్రేణ, చేతసా,
కచ్చిత్, అజ్ఞానసమ్మోహః, ప్రణష్టః, తే, ధనంజయ ॥ 72 ॥

1. *గీత -4వ అధ్యాయము-33వ శ్లోకార్థమును చూడనగును.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = | ఓ పార్థా! | ధనంజయ! | = | ఓ ధనంజయా! |
| ఏతత్ | = | ఈ గీతాశాస్త్రము | తే | = | నీ యొక్క |
| త్వయా | = | నీ చేత | అజ్ఞాన సమ్మోహః | = | అజ్ఞానజనితమైన మోహము |
| ఏకాగ్రేణ, చేతసా | = | ఏకాగ్రచిత్తముతో | | | |
| శ్రుతమ్, కచ్చిత్ | = | వినుట జరిగినదా? | కచ్చిత్, ప్రణష్టః | = | పూర్తిగా తొలగిపోయినదా? |

ఓ పార్థా! ఈ గీతాశాస్త్రమును నీవు ఏకాగ్రచిత్తముతో వింటివా? ఓ ధనంజయా! అజ్ఞానజనితమైన నీ మోహము పూర్తిగా నశించినదా? (72)

**అర్జున ఉవాచ**

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 73 ॥**

నష్టః, మోహః, స్మృతిః, లబ్ధా, త్వత్ప్రసాదాత్, మయా, అచ్యుత,
స్థితః, అస్మి, గతసందేహః, కరిష్యే, వచనమ్, తవ ॥ 73 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| అచ్యుత! | = | ఓ అచ్యుతా! | గతసందేహః, స్థితః, అస్మి | = | సందేహములు తొలగిన వాడనైతిని |
| త్వత్ప్రసాదాత్ | = | నీ అనుగ్రహము వలన | | | |
| (మమ) మోహః | = | నా మోహము | | | |
| నష్టః | = | (పూర్తిగా) తొలగినది | (అతః) | = | కనుక |
| మయా | = | నాచేత | తవ, వచనమ్ కరిష్యే | = | నీ ఆజ్ఞను తలదాల్చెదను |
| స్మృతిః | = | స్మృతి | | | |
| లబ్ధా | = | పొందబడినది | | | |

అర్జునుడు పలికెను - ఓ అచ్యుతా! నీ కృపచే నా మోహము పూర్తిగా తొలగినది. స్మృతిని పొందితిని. ఇప్పుడు సంశయరహితుడనైతిని. కనుక, నీ ఆజ్ఞను తలదాల్చెదను. (73)

**సంజయ ఉవాచ**

**ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాదమిమమశ్రౌషమ్ అద్భుతం రోమహర్షణమ్ ॥ 74 ॥**

ఇతి, అహమ్, వాసుదేవస్య, పార్థస్య, చ, మహాత్మనః,
సంవాదమ్, ఇమమ్, అశ్రౌషమ్, అద్భుతమ్, రోమహర్షణమ్ ॥ 74 ॥

| | | | |
|---|---|---|---|
| ఇతి | = ఈ ప్రకారముగా | అద్భుతమ్ | = అద్భుతమైన |
| అహమ్ | = నేను | రోమహర్షణమ్ | = తనువును పులకింప జేయునట్టి |
| వాసుదేవస్య | = శ్రీ కృష్ణునియొక్క | | |
| మహాత్మనః | = మహాత్ముడైన | | |
| పార్థస్య, చ | = అర్జునుని యొక్క | సంవాదమ్ | = సంవాదమును |
| ఇమమ్ | = ఈ | అశ్రౌషమ్ | = వింటిని |

సంజయుడు పలికెను - ఈ విధముగా శ్రీ వాసుదేవునకును మహాత్ముడైన అర్జునకును మధ్య జరిగిన సంవాదమును వింటిని. అది అద్భుతమైనది. తనువును పులకింపజేయునది. (74)

**వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యమహం పరమ్ ।**
**యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయమ్ ॥ 75 ॥**

వ్యాసప్రసాదాత్, శ్రుతవాన్, ఏతత్, గుహ్యమ్, అహమ్, పరమ్,
యోగమ్, యోగేశ్వరాత్, కృష్ణాత్, సాక్షాత్, కథయతః, స్వయమ్ ॥ 75 ॥

| | | | |
|---|---|---|---|
| వ్యాసప్రసాదాత్ | = వ్యాసభగవానుని కృపవలన (దివ్యదృష్టిని పొందిన వాడనై) | స్వయమ్ | = స్వయముగా |
| | | కథయతః | = చెప్పుచున్న (ఉపదేశించుచున్న) |
| అహమ్ | = నేను | | |
| ఏతత్ | = ఈ | యోగేశ్వరాత్ | = యోగేశ్వరుడైన |
| పరమ్, గుహ్యమ్ | = పరమగోప్యమైన | కృష్ణాత్ | = శ్రీకృష్ణభగవానుని నుండి |
| యోగమ్ | = యోగమును (గీతను) (అర్జునునకు) | సాక్షాత్ | = ప్రత్యక్షముగా |
| | | శ్రుతవాన్ | = వింటిని |

వేదవ్యాసునికృపవలన దివ్యదృష్టిని పొందినవాడనై, పరమగోప్యమైన ఈ యోగమును (గీతను), యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు స్వయముగ అర్జునునకు చెప్పుచుండగా నేను ప్రత్యక్షముగా వింటిని. (75)

**రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమ్ ఇమమద్భుతమ్ ।**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76 ॥**

రాజన్, సంస్మృత్య, సంస్మృత్య, సంవాదమ్, ఇమమ్, అద్భుతమ్,
కేశవార్జునయోః, పుణ్యమ్, హృష్యామి, చ, ముహుర్ముహుః ॥ 76 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజన్! | = | ఓ ధృతరాష్ట్ర మహారాజా! | సంవాదమ్ | = | సంవాదమును (గీతను) |
| కేశవార్జునయోః | = | శ్రీకృష్ణభగవానునకును, అర్జునునకును మధ్య జరిగిన | సంస్మృత్య, సంస్మృత్య | = | పదేపదే స్మరించుచు |
| ఇమమ్ | = | ఈ (పరమగోప్యమైన) | ముహుర్ముహుః | = | మాటిమాటికిని (నిరంతరము) |
| పుణ్యమ్ | = | పవిత్రమైన | హృష్యామి | = | ఆనందించుచున్నాను |
| అద్భుతమ్, చ | = | అద్భుతమైనదియగు | | | |

ఓ రాజా! (ధృతరాష్ట్రా!) శ్రీ కృష్ణభగవానునకును, అర్జునునకును మధ్య జరిగిన గోప్యమైన ఈ సంవాదము పుణ్యప్రదమైనది. అత్యద్భుతమైన ఈ సంవాదమును అనుక్షణము పదేపదే స్మరించుచు, నేను నిరంతరము ఆనందమున ఓలలాడుచున్నాను.(76)

**తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।**
**విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ॥ 77 ॥**

తత్, చ, సంస్మృత్య, సంస్మృత్య, రూపమ్, అతి, అద్భుతమ్, హరేః,
విస్మయః, మే, మహాన్, రాజన్, హృష్యామి, చ, పునః, పునః ॥ 77 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజన్! | = | ఓ రాజా! | మే | = | నాకు |
| హరేః[1] | = | శ్రీకృష్ణుని యొక్క | మహాన్, విస్మయః | = | అంతులేని ఆశ్చర్యము కలుగుచున్నది |
| తత్, అతి, అద్భుతమ్ | = | అట్టి అత్యద్భుతమైన | (అహమ్) | = | నేను |
| రూపమ్, చ | = | దివ్యరూపమునే | పునః, పునః | = | మాటిమాటికిని |
| సంస్మృత్య, సంస్మృత్య | = | పదేపదే స్మరించుట వలన | హృష్యామి | = | ఆనందమున పొంగిపోవుచున్నాను. |

1. తనను స్మరించిన వారి పాపములను హరించు వాడు 'హరి'.

ఓ రాజా! అత్యంత విలక్షణము, పరమాద్భుతము, అపూర్వము ఐన ఆ శ్రీహరి రూపమును పదేపదే స్మరించుచు, నేను పొందుచున్న సంభ్రమాశ్చర్యములకు అవధియే లేదు. తత్ప్రభావమున మఱలమఱల హర్షోల్లాసములతో పులకితగాత్రుడనగుచున్నాను. (77)

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 78 ॥**

యత్ర, యోగేశ్వరః, కృష్ణః, యత్ర, పార్థః, ధనుర్ధరః,
తత్ర, శ్రీః, విజయః, భూతిః, ధ్రువా, నీతిః, మతిః, మమ ॥ 78 ॥

| | | | |
|---|---|---|---|
| యత్ర | = ఎచ్చటనయితే | తత్ర, శ్రీః | = అచ్చట సిరి సంపదలును |
| యోగేశ్వరః, కృష్ణః | = యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు (ఉండునో) | విజయః | = సర్వవిజయములును |
| | | భూతిః | = సకలైశ్వర్యములును |
| యత్ర | = ఎచ్చటనయితే | ధ్రువా, నీతిః | = దృఢమైన నీతియు |
| ధనుర్ధరః, పార్థః | = గాండీవధనుస్సును చేతబట్టిన అర్జునుడు (ఉండునో) | (ఇతి) | ఉండును అని |
| | | మమ, మతిః | = నా నిశ్చితాభిప్రాయము |

ఓ రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడును, గాండీవధనుర్ధారియైన అర్జునుడును ఉండుచోట సంపదలును, సర్వవిజయములును, సకలైశ్వర్యములును, సుస్థిరమైన నీతియు ఉండును - అని నా నిశ్చితాభిప్రాయము. (78)

*ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగోనామ అష్టాదశోఽధ్యాయః ॥ ౧౮ ॥*

# గీతా హారతి

జయ భగవద్గీతే, జయ భగవద్గీతే
హరి-హియ-కమల-విహారిణి, సుందర సుపునీతే ॥ జయ ॥

కర్మ-సుమర్మ-ప్రకాశిని కామాసక్తిహరా
తత్త్వజ్ఞాన-వికాశిని విద్యాబ్రహ్మపరా ॥ జయ ॥

నిశ్చల-భక్తి-విధాయిని నిర్మల మలహారీ
శరణ-రహస్య-ప్రదాయిని సబ విధి సుఖకారీ ॥ జయ ॥

రాగ-ద్వేష-విదారిణి కారిణి మోద సదా
భవ-భయ-హారిణి తారిణి పరమానందప్రదా ॥ జయ ॥

అసుర భావ-వినాశిని నాశిని తమ-రజనీ
దైవీ సద్గుణదాయిని హరి-రసికా సజనీ ॥ జయ ॥

సమతా, త్యాగ సిఖావని, హరి-ముఖకీ బానీ
సకల శాస్త్రకీ స్వామిని శ్రుతియోంకీ రానీ ॥ జయ ॥

దయా-సుధా బరసావని మాతు! కృపా కీజై
హరి-పద-ప్రేమ దాన కర అపనో కర లీజై ॥ జయ ॥



# అచ్యుతాష్టకమ్

అచ్యుతం కేశవం రామనారాయణం
కృష్ణదామోదరం వాసుదేవం హరిమ్ ।
శ్రీధరం మాధవం గోపికావల్లభం
జానకీనాయకం రామచంద్రం భజే ॥ 1 ॥

అచ్యుతం కేశవం సత్యభామాధవం
మాధవం శ్రీధరం రాధికారాధితమ్ ।
ఇందిరామందిరం చేతసా సుందరం
దేవకీనందనం నందజం సందధే ॥ 2 ॥

విష్ణవే జిష్ణవే శంఖినే చక్రిణే
రుక్మిణీరాగిణే జానకీజానయే ।
వల్లవీవల్లభాయార్చితాయాత్మనే
కంసవిధ్వంసినే వంశినే తే నమః ॥ 3 ॥

కృష్ణ! గోవింద! హేరామ! నారాయణ!
శ్రీపతే! వాసుదేవాజిత! శ్రీనిధే! ।
అచ్యుతానంత! హే మాధవాధోక్షజ!
ద్వారకానాయక! ద్రౌపదీరక్షక! ॥ 4 ॥

రాక్షసక్షోభితః సీతయా శోభితో
దండకారణ్యభూపుణ్యతాకారణః ।

లక్ష్మణేనాన్వితో వానరైః సేవితో
అగస్త్య సంపూజితో రాఘవః పాతుమామ్ ॥ 5 ॥

ధేనుకారిష్ట కానిష్టకృద్ద్వేషిహా
కేశిహా కంసహృద్వంశికావాదకః ।
పూతనాకోపకః సూరజాఖేలనో
బాలగోపాలకః పాతు మాం సర్వదా ॥ 6 ॥

విద్యుదుద్యోతవత్ప్రస్ఫురద్వాససం
ప్రావృడంభోదవత్ప్రోల్లసద్విగ్రహమ్ ।
వన్యయా మాలయా శోభితోరఃస్థలం
లోహితాంఘ్రిద్వయం వారిజాక్షం భజే ॥ 7 ॥

కుంచితైః కుంతలైః భ్రాజమానాననం
రత్నమౌళిం లసత్కుండలంగండయోః ।
హారకేయూరకం కంకణప్రోజ్జ్వలం
కింకిణీమంజులం శ్యామలం తం భజే ॥ 8 ॥

అచ్యుతస్యాష్టకం యః పఠేదిష్టదం
ప్రేమతః ప్రత్యహంపూరుషస్సస్పృహమ్ ।
వృత్తతః సుందరం కర్తృవిశ్వంభర
స్తస్యవశ్యో హరిర్జాయతే సత్వరమ్ ॥

॥ ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృతమచ్యుతాష్టకం సంపూర్ణమ్. ॥

